# శ్రీగోవిందద్వాదశీదిగ్విజయము

ఇది

పెద్దాపురం కాపురస్థులు కాళ్లకూరి హనుమచ్ఛాస్త్రి
కవిగారిచే రచింపబడినది.

సకల విద్వద్బృందముచే పరిశోధింపబడి అంబాజీ
పేట కాపురస్థులగు మ॥ రా॥ శ్రీ॥ అద్దేపల్లి
శేషయ్యగారి ద్రవ్యసహాయములో,

కాకినాడ

కొలను రామకృష్ణయ్యగారి మనోరంజనీ ముద్రాయంత్రము
నందచ్చొత్తించబడి గణకవీరాభట్టాచార్యవర్య
శిష్యబృందంబుచే జగదుపకారంబగునటుల
ప్రకటింపంబడినది.

మొదటకూర్పు ప్రతులు 500 మాత్రము.

1915 సం॥

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 13 | వా'రెలధ | వారిధ |
| 11 | 15 | స్తుదుర్గ్గభః | స్తుదుర్లభ |
| 11 | 15 | ర్వల్లభ | ద్వల్లభ |
| 11 | 15 | రాజన | రాజన్త్ర |
| 12 | 4 | సె గిర | స్థై గిర |
| 12 | 11 | సంయుస్తు | సంయుక్త |
| 13 | 9 | వృష్యటీ | వృష్యత్సే |
| 13 | 12 | వృష్యత్స | వృష్యత్సే |
| .. | 12 | ద్వారశీ | ద్వాదశీ |
| 13 | 15 | ద్వాదసీ | ద్వాదశీ |
| 14 | 10 | సముగ్భ్రు | సమ్యగ్భ్రు |
| 15 | 4 | నైవిత్త | నైమిత్త |
| 16 | 5 | భిర | భీర |
| 16 | 5 | సకల పంతిత | సకల గణిత |
| 16 | 14 | మధ్యస్నానం | మధ్యస్థానం |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 23 | 8 | పెద్దు | పెద్ద |
| 23 | 14 | శ్శోక | శ్లోక |
| 25 | 13 | వహాముష్మి | మహాముష్మి |
| 27 | 2 | పత్రికజడివి | పత్రికం జదివి |
| 28 | 7 | నును | నున్ను |
| 28 | 8 | నస్తు | నస్తు |
| 29 | 6 | దూారము | దూారము |
| 31 | 7 | వంతా | వాంతా |
| 31 | 10-11 | చ న్నా-మార్ద | చున్నా-మార్గన |
| 31 | 13 | సిద్ధాంతి | సిద్ధాంత |
| 32 | 4 | జగధీ | జగదధీ |
| 32 | 8 | ఏది | ఎది |
| 32 | 8 | మహా | మహి |
| 32 | 9 | చేది | బెది |
| 32 | 10 | చేది | బెది |

చినను బోధపడక మేకపోతు గాంభీర్యమును జూప
నెంచిరో? లేక విమర్శింప నవసరము లేదని తలంచిరో?
కాని మెట్టుకి నీ దుర్లభ్య మహాపుణ్యకాలమును గంగ
లోఁగలిపి పాపమును మూటగట్టుకొనిరి. తక్కినవారు
పప్పులో కాలు వైచినను శ్రీ॥ మ॥ రా॥ రా॥ శ్రీ రాజా
అంకితం వెంకటజగ్గారావు బహద్దరువారి సంస్థానపం
డితులగు శ్రీమాన్ యచ్చాన్ తిరుమలై కాండూరి
తాండవకృష్ణమాచార్య దైవజ్ఞ చక్రవర్తులనలుమి
పహా కన్యాదానమున్నట్లు ప్రసిద్ధముగానున్న గురు
యోగమును దెలిసికొనక, గురుమాత్రయోగ వికల
ముగాఁ దమ పంచాంగమందు స్ఫుటముగా వ్రాసిరి.
జగత్ప్రసిద్ధ దైవజ్ఞసోదర సింహంబులగు శ్రీ మర్త్యాడ
వర్తివారు గూడ లోకము మీద సీతకన్ను వైచిరి. "మ
హాగజాగ పలాయంతె వా శకానాం తుకా గతిః" యు
న్నట్లు తక్కిన పంచాంగముల సంగతి యేల? అహా?
చూచితిరా? కాలమహిమ? మెట్లు మారిపోయిన

దో! లోకోపకారార్థమై పుట్టిన సాక్షాద్భగవత్స్వరూ
పులగు సిద్ధాంతులే మంచిచెడ్డలఁ జెప్పకపోయినఁ బా
మరలోకమునకు గతియేమి? ముందర మన రెండు వేల
పంచాంగముల నెవరికి బట్టిత్తుము? ఎప్పుడు సంవ
త్సరాదివచ్చునా! మామూళ్లనెప్పుడు వసూలుచే
యుదుమా! యను సాందోళనంబుతో గణితములగు
ణించ వలసినవిధులు పంచాంగములలో నెక్కునా?
పంచాంగమన నిట్టి పన్నాకితముల డంబాచారమె కా
బోలు. చివరకు జ్యోతిషము మామూళ్లకున్నూ, కవి
త్వమొకరినొకరు తిట్టి పోసికొనుటకున్ను, చదువులు
కులభ్రష్టత్వమునకున్ను, హేతుభూతములైనవి. గత
జలసేతుబంధన మేటికిఁగాని ప్రస్తుతవిషయమై చర్చిం
తము. కట్టుగట్టి సిద్ధాంతిమండలం బెల్ల నూరకొనగా, యీ
మహాపుణ్యకాలమును జెప్పకపోయినను దయామ
యుండగు నీశ్వరుండెవ్వరి హృదయంబులలోనైన జొ
రబడి చెప్పింపకుండునా? యను నమ్మకము నకుఁ దా

ర్యాణముగా సుప్రసిద్ధ బ్రహ్మశ్రీ బాల పూర్ణయ్య దైవజ్ఞశిరోమణుల ప్రియశిష్యులై రాజవోలు తాలూకా మునిఖండమహాగ్రహారనివాసులై శ్రీరాజా శ్రీను వ్యం మహాలక్ష్మమ్మ రాజ్ఞీవారి సంస్థానపండితులై॥

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రమహోదధిం స్వధిషణామందరేణ నిర్మంథ్యయో। తచ్ఛిద్ధాంతసుహావబోధ జనితానందామృతా స్వాదనాత్। వాసిష్ఠం సముదీపదీపయన్మహా జగద్దీపాఖ్యయా వ్యాఖ్యయా। యోవిష్టో బహుపక్షిణ క్రతురిహామున్నామరాం స్తర్పయన్॥ శ్లో॥ జ్యోష్టామాదికర్మప్రవణతమ మతిర్బ్రహ్మవిద్యాప్రసంచ। ప్రిష్టశ్రీప్రిష్టోక్షవిద్యామృతరపలహరీపానవీనాంతరంగ। సాహిత్యాద్యానవద్యా లఘుతరసుమహాకావ్య చాతుర్యవిద్యా। పద్యాపాండిత్య శౌండోవహితమునికులై సోమయాజీచకాస్తి॥ అని కేవలము స్వభావోక్తిగా వర్ణింపబడిన విదితయశులగు బ్రహ్మశ్రీ శ్రీమచ్చిమలపాటి సూరిదయ్యసిద్ధాంతి సోమయాజులవారు మనను

దృష్టవశంబున దను ప్రమాదీచసంవత్సర పంచాంగ మందు పరిపూర్ణముగా విమర్శించి, కేవల మాముష్మికఫలానుసారముఁ దస్ప్రకేంద్ర, ముఖ్యేతర, ముఖ్యకల్ప, అను కల్పములు మూడువిధములుగా నీమహాపుణ్యకాలము కలుగునని పదునాలుగుమతముల ననుసరించి శాస్త్రనిదర్శనముగా దైవజ్ఞులెల్లరుం దలయూచునట్లు వ్రాసి, లోకుల నెల్లఁ దటంపజేసిరి. వీరిశిష్యులలోఁ జేరూరుగ్రామ శాస్త్రులు బ్రహ్మశ్రీ సేమాని వెంకటరమణయ్య సిద్ధాంతిగారు కల్పత్రయభేదముతో వ్రాసిరి. తమతమ పంచాంగములలో వీరిట్లు ప్రకటించి సుమారు 12 మాసములైనను దక్షిణసిద్ధాంతులెవరో కాని, యిట్లు వ్రాయుటకుఁ గారణంబేలయని కాని, యసందర్భమనికాని, పరిపూర్ణభోగములు పట్టలేదనికాని, విమర్శించుట తప్పనికాని, పత్రికాముఖములనైన వెల్లడింపకఁ జెల్లముఁగొట్టిన రాలవలెనూరకుండి, కించజ్ఞులయెదుట సొరకాయలఁగోయుచు నట్లు

వ్రాసినవారిని శాకినాడంతా యేకమై ముక్కు నేలబెట్టి
వ్రాయక విడిచిపెట్టరు మా సమయము రానిండని యు
త్తరకుమారప్రజ్ఞలకు వన్నెబెట్టుచు బ్రహ్మశ్రీ (బ్రహ్మా
నంద, సీతారామయ్యగార్లు మొదలగు సిద్ధాంతిరత్న
ములు, లోకమంతయు దిరించుచు సీయులభ్యమహాపుణ్య
కాలమును, రిత్తబుచ్చుటకుఁ దలఁచఁగా సర్వవయో
మయుండగు సిశ్వరుండూ కానక బ్రహ్మశ్రీ చీ॥ మ॥
సి॥ సో॥ నారిని శిష్యులతోఁ గార్యాంతరములఁ గల్పిం
చి పంచాంగముల ప్రింటుమూలముగాఁ గడచిననెల
26 వ తేదీని రప్పింపగా వ్రాసియిచ్చుటన్న గద్దం
వెంకన్న బ్రిదర్సు వారిచే నాహ్వాయమానులై వా
రి స్వగృహంబున నిలచిరి. కొన్ని దినములతరువా
తఁ గొందరు జ్యోతిష్కులుగూడా విత్పటికిఁ దయచే
యుట తటస్థించఁగా వీరిని వారిని నొకచో గూర్చుం
డబెట్టి గోవిందద్వాదశీ విషయమై నేనడుగగాఁ గోడ
మీదఁ బిల్లివాటముగా సమాధానము చెప్పి బ్రహ్మ

ప్ర ్రిహ్మవంవ సిద్ధాంతిగారు మొదలగు
సిద్ధాం ,సచ్చి॥ మ॥ సి॥ సో॥ గారు శ్రుతి
స్మృతిపు నిదర్శనముగాఁ బెక్కుశ్లోకముల ధా
రాధరంబు వర్షించునట్లు, నరములుబిగినభంగి ప్రశా
స్యముగా వినువారికెల్లరకు సమంజసమని తోప నుప
న్యసింపగాఁ దగిన యుత్తరంబు లోపంగక “ నవ్వా
సూం వ్రాయలేదు. మేమూ వ్రాయలేద ” ని హాస్యా
స్పదములగు జవాబులనిచ్చుచుఁ జల్లచల్లగా జారఁగా
నీ సోమయాజిగా రలభ్యమైన నీమహాపుణ్యకాలము
ను స్థిరపరచి, శ్రీమపకి, లోకులనెల్ల నీపుణ్యయోగం
బునఁ దరింపఁజేయనెంచి, సభాముఖమున గాని, సి
ద్ధాంతీకరణము జరుగఁదని తలంచి, కాకినాడ సభాప
తులగు, బ్రహ్మశ్రీ యనమండ్రి బాపన్నగారు, బ్ర
హ్మశ్రీ బలిజపల్లి రామమూర్తిశాస్త్రిగారు, బ్రహ్మ
శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ
మైలవరపు వెంకటశాస్త్రిగారు, మున్నగు అర్థికమహా

జన శిరోమణుల చేఁతకరిగి ఐదునాలుగుమతములలో నున్న ఋషిప్రోక్తములగు శ్లోకములను బోధించి, యొప్పించఁగా వారు సభకేయించుట కేర్పాటుసల్పి యాహ్వానపత్రికలఁ బురిమెల్లెడలఁ బంపించిరి. లోకో పకారార్థము శ్రమపడిన నీమహానుభావులకుఁ గూడ మహాఫలంబు సిద్ధించుఁగాత! తదనంతరంబు 7-3-14 తేదిని 5 గంటలు మొదలు 8 గంటలవరకు కాకినాడ లో శ్రీవేణుగోపాలస్వామివారి యాలయములో సక ల దైవజ్ఞవిద్వజ్జన మహాసభయొకటి జరిగెను. «విశి ష్టశాస్త్రాలాస్త్రాః కలావిదస్సజ్జనాః" అని కాళిదా సోక్తికి నిదర్శనము కనఁబడియెను.

శ్రీగోవిందబ్యావరీ దైవజ్ఞవిద్వజ్జన మహాసభ.

---

5 గంటలు టంగునఁ గొట్టినతోడనే, పెనుదీ యకకేవలము లోకోపకారార్థమగు చింతనతో, మొ

ట్టవెంపట బ్రహ్మశ్రీ య॥ శా॥ గారున్ను బ్ర॥ శ్రీ॥ బ॥ రా॥ శా॥ గారున్ను కా॥ బ్ర॥ శా॥ గారున్ను మున్నగు విద్వచ్ఛిరోమణులా సభాభవనం బలంకరించిరి. వర్తమానమంపినతోడనే యూపఁబోయినఁ దీక్ష మెదుర్రైనట్లుగా దలంచి బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారధికసంతోష పరీతస్వాంతులై శాంతరసం బుట్టిపడునెమ్మోమున శ్రుతిస్మృతులు ఘోషింపుచుండగా, గండంబులఁ గుండలతాండవంబులు చూపరనాకర్షింప, నిరువంకలం బ్రియశిష్యులు బరాబరులు సేయుచు, గోడురా, నాచార్యావతారంబు పగిది నమ్మహాసభకుం జని సన్మానముతో నాదరింపంబడి, నక్షత్రగణంబున విడియచందురుభంగి సభ నలంకరించిరి. కించద్వైదజ్ఞు గుండెలలో పెద్ద చాపరాళ్లుపడినవి. నాస్తికులకు గుడగుడశబ్దంబు లుద్భవించినవి. పత్రికలందినను, భీతిచే సభకు రానిసిద్ధాంతులు గోడమీదఁ బచారులు సేయు

చు నివసువారస మూరుపేర్లు చెప్పకొనుటకుఁ దొడం గిరి. ఆవిఁతయట్లుండగా, బ్రహ్మశ్రీ య॥ శా॥ గారు, బ్రహ్మశ్రీ శా॥ బ్ర॥ గారు మొదలగువారు పూర్వ ము విజయనగర మహాసంస్థాన పండితులగు బ్రహ్మశ్రీ పిడపర్తి దక్షిణామూర్తి సాస్త్రిగారు రచించిన ధా త, యీశ్వర పంచాంగంబులఁ దెప్పించి నైపత్యశింపు లగు, శ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారినిట్లు ప్రశ్నించిరి.

“ అయ్యా ! పూర్వమీ దేశమంతయు నాచ రించిన ధాత సంవత్సరములో నిద్యాదశీమహాపుణ్య కాల మెట్లుసిద్ధించినది ?

“ ఫాల్గునశుద్ధ ద్వాదశీ, ఆదివారము, పుష్యన క్షత్రము, తిధ్యంతమందు శోభననామ యోగము అతి విభూతియలు కలిగియుండుటచేతనున్ను, కుంభ సూర్య ధనుర్గురు లుండుటచేతనున్ను, మీరడిగిన పుణ్యకాల ము తటస్థించినది. ”

« ఈప్రమాదీచలో నన్ని యోగములు కలి గినవి ?

« ఫాల్గునశుద్ధ యేకాదశీ, ఆదివారము, ౨౭ ఘ ౩౦ విఘడియలు గడచినది మొదలు రాత్రిఘ౫౦-౩౦వరకు మందమాత్రయోగ వికలముగా నన్ని యోగములు సిద్ధించినవి. పిమ్మట ౫౭_ ఘడియలవరకు న నగా (5¼ ఘడియలు) శోభనయోగము లేక మి గిలిన ౮ యోగములు సిద్ధించినవి. అది మొదలు మ రుచటిదినము పగలు ౧౨ ఘడియలవరకు బవకరణ ము లేక మిగిలిన ౭ యోగయోగములు తటస్థించినవి.

పత్రికచంద్రికాయాం॥ శ్లో॥ కోదండస్థే సురాచార్యే కుంభస్థే చ దివాకరే। పుష్యర్క్షే శోభనే యోగే ఫాల్గున్యాం శుక్లపక్షకే। భానువారే అక్షవాసా మద్వాదశీ బవకరణయుతా। గోవింద ద్వాదశీనామ పుణ్యా యోగ స్సుదుర్లభః॥౧॥ జగద్వల్లభః॥ కుంభస్థే భాస్కరే రాజన కర్కస్థే నైశ్చరే। ద్వాదశీ శుక్లపక్షస్య జీవే ధనుషి సం

యుతే । పుష్యర్క్షేరవివారే చ యోగే శోభనసంజ్ఞి
కే । మహాపాతకసంఘఘ్నీ గోవిందద్వాదశీస్మృతా॥
౨॥ గారుడపురాణే। కుంభస్థే భాస్కరే రాజన్మకర
సంగిరస్యపి । ద్వాదశీ శుక్లపక్షస్య పుష్యర్క్షేణ జా
యతే యది । తిథిరేషా మహాపుణ్యా బ్రహ్మణా పరికీర్తి
తా । గోవిందద్వాదశీనామ మహాపాతకనాశినీ॥ 3॥
నిర్ణయసింధౌ॥ ఫాల్గునస్యామలే పక్షే కుంభస్థే దిననాథ
పే । జీవేధనుషవామందే మకరేవావివాసరే । పుష్యన
క్షత్రసంయుక్తే గోవిందద్వాదశీస్మృతా ॥౪॥ సిద్ధాంత
సరళ్యాం ॥ కుంభేవా ఫాల్గునేస్యాన్మకరస్థేశనైశ్చ
రే । జీవేధనుషిసంయుక్తే ద్వాదశీశుక్లపక్షకే । పుష్య
ర్క్షే యదిసంపూర్ణే భానువారేణసంయుతే । గోవిం
దద్వాదశీనామ మహాపాతకనాశినీ। ౫॥ జగద్వల్లభ॥
వినాపుష్యర్క్షయోగం వా గోవిందద్వాదశీశుభా ।
దద్యాద్దైవవిష్ణుసాయుజ్యం క్షేత్రే శ్రీపురుషోత్తమే ॥
కాలచంద్రికాయాః॥ ఫాల్గునస్యసితే పక్షే కుంభస్థేది

వసాధిపే । జీవేశ్వసుషిణామందె మకరే రవివాసరే ।
పుష్యర్క్షేయదిసంప్రాప్తే గోవిందద్వాదశీస్మృతా॥౬॥
కల్పాన్తర్గ్యాసుష్యైవమేవోక్తం ॥ యథా॥ ఫాల్గునస్య
మలేపక్షే కుంభస్థేదివసాధిపే । జీవేధనుషిణామందే
మకరే రవివాసరే । పుష్యనక్షత్రసంయుక్తా గోవింద
ద్వాదశీస్మృతా॥ ౭॥ దైవజ్ఞవిలాసే కావచంద్రికోక్త
వచనమప్యుక్తం॥౮॥ భవిష్యోత్తరపురాణే ప్యేవము
క్తం॥౯॥ బ్రహ్మాణ్డపురాణే॥ కుంభస్థే భాస్కరే చాపే
మకరేవాంగిరాశ్శని॥ ద్వాదశీశుక్లపక్షస్య పుష్యర్క్షే
జాయతేయది । గోవిందద్వాదశీనామ మహాపాతకనా
శనీ॥౧౦॥ బ్రహ్మపురాణె। కుంభస్థితే భాస్కరే రాజన్మ
కరస్థేశనైశ్చరే । ద్వాదశీశుక్లపక్షస్య పుష్యర్క్షేయది
జాయతే । తిథిరేషా మహాపుణ్యా బ్రహ్మణాపరికీర్తితా॥
గోవిందద్వాదశీనామ మహాపాతకనాశనీ॥ ౧౧॥ వ్రత
మహార్ణవే॥ పుష్యర్క్షేద్వాదశీయుక్తా కుంభస్థేచది
వాకరే । మహాపుణ్యతమాకాలేపూజ్యా బ్రహ్మహరి

శ్వరాః । గోవిందద్వాదశీం ప్రాప్య యేవ్రతం నాచరం తితే । అత్యంతదుఃఖినో భూత్వా సంసారేషు పతంతి తే॥ ౧౨॥ స్కందపురాణే॥ ఫాల్గునస్యసితేపక్షే కుంభ స్థేచదివాకరే । పుష్యర్క్షేణ యుదిసంయుక్తా గోవింద ద్వాదశీస్మృతా॥ ౧౩॥ విష్ణుధర్మోత్తరే॥ ఫాల్గునామ లపక్షస్య పుష్యర్క్షేణ ద్వాదశీయది । గోవిందద్వాదశీ నామ మహాపాతకనాశనీ॥ ౧౪॥ బ్రహ్మపురాణే॥ గో విందద్వాదశీనామ మహాపాతకనాశనీ । తస్యాం మ హోదధిస్నానం దృష్ట్వాతుపురుషోత్తమం । యత్ఫలం ప్రాప్య తేనమర్త్యః ఋషుప్యావహితో నృప । శతసంవత్స రం గంగాస్నానపుణ్య మవాప్నుయాదితి॥

అని ఋషిప్రోక్త శ్లోకముల ఐదువుడు ప్రమా ణములుఁ గనపరుచుచుండు రవకందాయములో నుట్టి పతివ్రలైచ్ఛటిసుఁడితౌలా ? వయ్యాకరణులగు బ్రహ్మ శ్రీ వేరి సేరయ్యశాస్త్రిగారున్ను, శతావధాని బ్రి హ్మశ్రీ దివాకర్ల తిరుపశాస్త్రిగారున్ను విచ్చేసి, ఐ

రుగుచున్న ప్రసంగంబులవిని « మీరు చెప్పిన రాత్రి
గల్గిన పుణ్యకాలమునకు విశేషయోగములున్నను
రాత్రి సముద్రస్నానముఁ జేయవచ్చునా ?

« నైమిత్తికములగు చంద్రగ్రహణాది పర్వము
లయందు విధిగా నిర్ణయింపబడిన సముద్రస్నానమెట్టు
ల నాచరింపుచుండిరో ? యటువలెనె నైమిత్తికమగు
నీయలభ్యయోగ మహాపుణ్యకాలమునకుం గూడ స
ముద్రస్నానముఁ జేయుటకు సందేహమేముండును !
అని యనేక ప్రమాణములతో గూడినఁ ప్రత్యుత్తరం
బులిచ్చినతరువాత నొకరి మొగంబులొకరు చూచు
గొనుచుఁ గొందరు పండితులు తలలు వంచిరి. కొంద
రుపలుకె బంగారమయ్యెను. కొందరిమాట వరాల
మూటయయ్యెను. కొందరు నాస్తికులు కూడదనియు
కొందరాస్తికులు నిజమేయనియు, వితండవాదముల
కుం దొడంగిరి. వాదంబులు ముదిరినవి. చినుకు చిను
కు గాలివానయయ్యెను. కోపంబులువచ్చెను. మొ

గములు జేవురించుటకు సిద్ధమైనవి. సభయంతయు నానాగోష్ఠులుగా నొకరి మాటలొకరికి వినబడకుండ నిరాఘాట తర్కములకులోనై కేకలు పెడబొబ్బలు పెల్లుమీరుచుండు మంచితరుణంబునందు, శ్లో॥ ఆకృతిగంభీరవచః పరిపూర్ణం । సకలపండిత పరిపూర్ణం విడపతిః బాలపూర్ణం । కలయేజ్యోతిఃకలా సుపరిపూర్ణం॥ అని తమ సంపూర్ణగురుభక్తి తేటపడ, శిష్యులగు బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారు వర్ణించిన స్వభావోక్తికిం దార్కాణముగా సాక్షాచ్ఛ్రీగోవిందుని యవతారమో? లేక వేదవ్యాసుని పరరూపమో నానుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ పిడపర్తి చిదపూర్ణయ్య దైవజ్ఞచక్రవర్తి కాకతాళీయంబుగ నత్తటికేగుదెంచినతోడనే సభాకల్లోల మణంగెను. సభికులందరు వారిని, సభామధ్యస్థానంబునకుం దెచ్చి బహువిధములం గారవించి, పెక్కురీతుల స్తుతించుచు నిట్లడిగిరి.

« మహాత్మా! అలభ్యయోగము నీగోవింద

ద్వాదశీ పుణ్యకాలమును మీరు పూర్తిగా సంగీక రించక విడిచిపెట్టినట్లున్నది. తమ శిష్యులగు చి॥ మ॥ సి॥ సా॥ గారు ఋషిప్రోక్తశ్లోకములచే సిద్ధాంతీకరించి జానెడుమూరెడు పొడుగున బత్రికం బ్రచురించిరి. కారణము వినగోరుచున్నాము. తెలుపఁ బ్రార్థితులు ” అని యడుగఁగా అంతట దైవజ్ఞసింహంబు తన ప్రజ్ఞాపరాక్రమంబునకుఁ గించజ్ఞమృగంబులెల్ల భీతినొందఁగా బావానస్వాలవం బొనర్చుచు, నాలయం బెల్ల నిజగంభీర వాగ్గర్జారావంబులఁ బ్రతిధ్వనులీయ, నిట్లని ప్రత్యుత్తరమిచ్చె.

“ పూర్వమునుంచి బహుగ్రంథంబులం బరిశీలించి, శార్వరి, శుభకృత్, శోభకృ ద్వత్సరంబులలో వచ్చిన గోవిందద్వాదశిని యుక్తియుక్తముగా నాపంచాంగంబున వ్రాసియున్నాను. కాని పామరలోకము గుటచే నెవ్వరు నాచరింపని హేతువుచేత నిప్పుడీ న్యాయప్రసిద్ధ పుణ్యకాలము తటస్థించినను లోకమాచ

తిరుగా సిద్ధించలేదని కారణముచేతను, వారి పంచాం
గమందు వ్రాసి యుండనట్లు స్పష్టమగుటచే నీయోగ
ము సిద్ధింపలేదనియె నాయభిప్రాయమను వీకులాట
పంచాంగమునువిప్పగా బ్రహ్మశ్రీ కా॥ బ్ర॥ శాస్త్రి
గారు లేచి వారు స్వయముగా సభకు విచ్చేసి, పం
చాంగమందు వ్రాయకపోవుటకు గారణముఁ దెలియ
పరుచుచు నీయోగము సిద్ధించినదని వారిదివరలో చె
ల్పినప్పుడు మనము వేరె యభిప్రాయపడుట మంచిది
కాదని శెలవిచ్చి కూర్చొనిరి. అపైని బ్రహ్మశ్రీ దీ॥
తి॥ శాస్త్రిగారు లేచి కొన్ని యుక్తులు బ్రహ్మశ్రీ
కా॥ బ్ర॥ శాస్త్రిగారు లేచి కొన్నియుక్తులను బన్ను
కొనఁ గడఁవులఁ జేతబట్టుకుని సర్వ సభ్యులందరు ప
రస్పరవాక్య సమ్మోహనాస్త్రంబుల పైమునుపఁజేయు
చుఁ జమత్కారోక్తి, పరిహాసోక్తి, బహుళోక్తి, యత్యు
క్తి, భళోక్తి, యుఁ జేటఁబడ నాపండితవరు లిద్దరుఁ
గొంతవరకు వినోదక్రీడలు సల్పిరి. తద్దిన ప్రసంగంబు

ల వర్ణించుటకు నాకలంబునకే గాక దేనికైన నలవి
కాదనియె నా తాత్పర్యము. ఇట్లు పండిత శార్దూలంబు
లు పరస్పర భీకరాట్టహాసంబులతో బొబ్బరిల్ల నాల
యంబె గాకc బట్టణంబంతయు ఘూర్ణిల్లె. సభయందు
న్న నూతన సిద్ధాంతులట్టి పులుకు నట్టడికి, కుత్తుకలలోc
బచ్చి వెలగకాయ లమ్ముపడిన ట్లేమియుం జెప్ప నేరకc జి
త్రముగాc జిత్రములై చిత్రముల రీతి నుండిరి. సభకు
రాక నక్కపక్కడ నిలచి తొంగితొంగిచూచు సిద్ధాం
తులు దాంతరయంబున నాటిన పరుష వాక్య శరాఘాతం
బుల నేమిc గొంపములు గునోయని పిక్కబలము
జూపెట్టిరి. తరువాత బ్రహ్మశ్రీ కా॥ బ్ర॥ శాస్త్రి
గారు సభవారి వైపున లేచి " పెద్దల విషయములో
మనమేవిధమైన యపచారమును జేయగూడదనియు
బ్రహ్మశ్రీ పి॥ చి॥ పు॥ సిద్ధాంతిగారు సభామధ్యం
బున లేచి యీపుణ్యకాలము యదార్థముగా సిద్ధించి

సదనియుఁ బెక్కుసారులు చెప్పినను బెడఁ చెవింబెట్టి పర
స్పరమిట్లు వాదమాడికొనుచుఁ గాలము రిత్తపుచ్చు
ట గూడదని శెలవీయగా బ్రహ్మశ్రీ ది॥ తి॥ శాస్త్రి
గారు లేచి యిదివరలో వారు పంచాంగమందు వ్రా
యకపోవుటచేతను యీసభయం దిప్పుడున్నదని చె
ప్పుటచేతను భయమంది చెప్పినట్లుగాఁ దలంచి యట్లం
టినిగాని, వారు యదార్థహృదయముతో నీపుణ్యకా
లము కలదని చెప్పినచో నాకును సమ్మతమేయనుట
విని బ్రహ్మశ్రీ పి॥ చి॥ పు॥ సిద్ధాంతిచక్రవర్తి లేచి
సభ యంతయు, నెవ్వరపడి ఱెప్పవ్రాల్పక, నిశ్శబ్దము
గా దన్నవలోకించుచుండ, నిరంకుశ, నిర్భయ, నిరా
ఘాట, వచః పాటవంబు తేటపడ ముద్దులు మూటగ
ట్టినట్లు గంభీరముగా “ నాకేవిధమైన భయమును లే
దు. సోమవార ముదయమందే పుణ్యకాలముఁ జేసికొ
నుటకు యదార్థముగా నా సమ్మతమేయని కంఠోక్తి
గా శెలవిచ్చిరి” అప్పుడు సభ యంతయుఁ గరతాళ

క్యసులతో భేదము కలుగఁగాఁ జూచి యూరుఁగొనక
బ్రహ్మశ్రీ ది॥ తి॥ శాస్త్రిగారు లేచి ,, ఏఋషిసమ్మత
మై యీయోగము సిద్ధించినదో లేక పూర్తిగా లే
కుండా పోయినదో నిశ్చయపరచి ప్రమాణములు
చూపింపుడని బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారిని
ప్రశ్నించిరి. బ్రహ్మశ్రీ పుర్వ్యమా మహేశ్వరశాస్త్రి
గారిచేఁ బహిష్కరింపఁబడిన పత్రికలఁ బదిమందియుఁ
బుచ్చుకొనిరి. బ్రహ్మశ్రీ పెద్ద దక్షిణామూర్తి శా
స్త్రులుగారు రచించిన పూర్వపు గోవిందద్వాదశీవిష
యమైన ధర్మశాస్త్రముగల ఈశ్వరసంవత్సర పంచాం
గమును బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారు స్వీకరించి
యందు ప్రమాణవచనములనుఁ జూపించుచు గారు
డాది మహాపురాణములయందుఁ జెప్పియుండుటంబట్టి
యీయోగము తటస్థించినదని ఋషిప్రోక్తశ్లోకవర్గం
బు గురిపింపగా సభ్యులందఱేకగ్రీవముగా నంగీకరించి
యీ గోవిందద్వాదశీ పుణ్యకాలము సిద్ధించినదని సి

ద్ధాంతీకరించిరి. లోకమునకు దెలియగలందులకై యీ క్రింది తీర్మానపత్రికను బ్రకటించిరి.

## శ్రీ గోవింద ద్వాదశీ తీర్మానము.

" నేటిసాయంకాలము జరిగిన సభలో వైష్ణవ శిరోమణులగు బ్రహ్మశ్రీ పిసపాటి చిదంబరయ్య సిద్ధాంతిగారు బ్రహ్మశ్రీ చీమలపాటి మిడయ్యసిద్ధాంతి సోమయాజిగారు, బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారు, బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిగారు, మున్నగు విద్వజ్జన మహాజనులీ ఫాల్గున శు ౧౨ సోమవాసరమున గరుడపురాణాది గ్రంధరీతిచే గోవింద ద్వాదశీ మహాపుణ్యకాలమును సలభ్యయోగము లిట స్థించినదని సిద్ధాంతీకరించిరి. కాబట్టి యాస్తికమహాజనులందరు సోమవార ముదయమున గోవిందద్వాదశిఁ

జేసికొందురుగాక.

ఇట్లు సభాపతులు

| | |
|---|---|
| కాకినాడ | మైలవరపు వెంకటశాస్త్రి అనియున్నది |
| 27-3-14 | యనమండ్రి బాపన్న అనియున్నది |
| | బలిజపల్లి రామమూర్తి శాస్త్రి అనియున్నది |
| | కాశీభట్ట బ్రహ్మయ్య అనియున్నది. |

తదనంతరంబు బ్రహ్మశ్రీ పి॥ చి॥ పూ॥ సిద్ధాంతిగారు మొదలగువారు సభ వెడలిపోయిరి. సభ ముగించి వచ్చునపుడు మహాపుణ్యమూర్తులగు బ్రహ్మశ్రీ చీ॥ మ॥ సి॥ సో॥ గారతి మోదముతో వినయపూర్వకముగా నిట్లు తెలవిచ్చిరి. " ఆస్తికమహాజనులారా ! నేను బహుశ్రమపడి యనేక గ్రంథములఁ బరిశీలించి కేవల మాముష్మికాపేక్షతో నీయలభ్య మహాపుణ్యకాలమును నా పంచాంగమందు చేర్పించి వ్రాసినందులకు మీయావన్మంది విద్వన్మహాజనులిందరీపట్నంబున సభచేసి యీ పుణ్యకాలమును స్థిరపరచి మహామ

వారు లందరచే నాచరింపఁ జేయుచున్న నీ విద్వద్వరాగ్రగ
ణ్యులకెల్ల ననేక వందనంబు లర్పించుచున్నానని మృ
దుమధురోక్తులతో నుపన్యసింపగా బ్రహ్మశ్రీ య॥
శా॥ గారు లేచి « సిద్ధాంతులుపేక్షచే నుపేక్షింపబడి
న నీ యలభ్య గోవిందద్వాదశీ పుణ్యకాలమును పం
చాంగమునందు వ్రాసి యస్మదాదులందరికే గాక లో
కమునకెల్ల నీ మహాపుణ్యమును సంభవింప జేసినవారగు
టవల్లఁ దమ కనేక వందనంబు లర్పించుచున్నానని చె
ప్పిరి. ఒకపెట్టున సభవారందరుఁ దమ వాక్ప్రసూనం
బుల శ్రీమచ్చీ॥ మ॥ సి॥ సా॥ గారినిఁ బూజించి సభ
ముగించిరి. బ్రహ్మశ్రీ బ॥ గా॥ శాస్త్రిగారు మున్నగు
భక్తశిఖామణు లత్యంతానందముతో భజగోవిందముల
బాడుచు గోవిందభజన సేయుచుఁ దమయిండ్లకు విచ్చే
సిరి. మరునాడు శ్రీ చీ॥ మ॥ సి॥ సా॥ గారి ప్రఖ్యాతి
యు వారి సంపూర్ణసిద్ధాంతమును పరిపూర్ణజయమును
కాకినాడపట్న మాబాలగోపాలముగాఁ దెలియుటఁ

దోడన గ్రామనభాపతులు పురోహితులులోనగు బ్రా హ్మణసంఘంబు పురజనులకు జయపత్రిక జదివి యి చ్చుచు పుణ్యకాలమహిమను జెప్పుచు యుండగునూ వ్రాయనటువంటి యీమహాపుణ్యకాలమును స్థిరపరచి న విద్వాంసులును దైవజ్ఞశిరోమణులునగు శ్రీనుబ్బ మా॥ సి॥ సా॥గారీయనియునుచు వారి ననేకరీతుల స్తుతిం చుచు బాజారుమధ్యనుండి పోవుచుండ పట్టణంబంత యుఁ జిన్న పూఁదెనెపట్టున కీగలుముసిరినట్టుఁ జుట్టు కొని, యత్యద్భుతముగా నీ గోవిందద్వాదశీ మహాత్మ్య మును వినఁజొచ్చిరి. యీగుంపులనుఁ జూచి పోలీసు వా రనేకులు ప్రత్యక్షమై సంఘములిట్లు చేరుట చట్ట మునకు విరుద్ధమని చెప్పుచుండగా దోవలో ననేకసం ఘము లేర్పడినవి. కాని మాన్పించుటకు పోలీసువారి కసాధ్యమైనది. ఆదివారము సాయంత్రము 5 గంటల వరకు పురజనులందరమ్మహాత్మ్యల వినుచక వారి వా గ్వాగురలం జిక్కినపి వెనువెంట బోయిపోయి శెల

వులు గైకొని మరలిరి. కొందరు భక్తులమ్మహాత్ములు 5 గంటలు మొదలుకొని 7 గంటలవరకు 9 యోగములుం గలసినదనియును యిప్పటినుండియు నాఘన్యకాలము విశేషించి కలదనియు నొక్కి వక్కాణించుటచేత మనమిప్పుడె సముద్రస్నానము జేయవలయునని యారాత్రియె బోయిరి. పల్లకములో మూడువంతులు గుట్టపై బండ్లమీదను రెండు వంతులు కాలినడకతోను ఒకవంతు గోవింద భజనలతోనున్ను తుర్యాసంగమమునకున్ను సీకుష్టమాపీసు రేవునకున్ను బోయిరి. పౌరోహితులున్ను బ్రాహ్మణులున్నుం దలవని తలంపుగా నా ముంగండ పుణ్యాత్ముడీ రూపకముగా మనల రక్షించినాడని మొక్కులిచ్చుచు సంవత్సరమునకుం జాలిన గోభూధన కనక వస్త్రవాహన దానంబులం గైకొని విధియుక్తముగా వచ్చినవారిం గృతకృత్యులం జేసిరి. ఆరేయి గోవింద భజనలతో భల్లువం దెల్లవారి పొద్దు పోటున్కున్ బొడిచే సరికి ననేక వేలమంది వివిధమైన

వేడుకలతో, నూరేగింపు టుత్సవములతో ననేక వా
హనంబులతో ననేకరీతుల సీకష్టమాపీసు కేవునకున్ను
జొల్లంగి కేవునకున్నుఁ బోయి మహాసంకల్ప పూర్వక
ముగా, స్నానంబు లాచరించువారును, నౌకాయాత్రి
ల జేయువారును, నా యాత్రిలవలనఁ ఫలము లేదని
కాలినడకఁ బోవువారున్ను, దూరముగా సముద్రిము
లోనికి మొలబంటివరకుఁ గొందరు పోయిన తోడనే
కొంతవరకు కాళీమైనదని రాధాకృష్ణ ప్రితిమలను గో
వింద విగ్రిహములనుఁ గల్పిక్తముగ నారాధించు వా
రున్ను, దుర్లభయోగఃబగు నీ మహాపుణ్యకాలంబునం
దుఁ దీర్థవిధుల జేయకఁ దప్పదని తీర్థశార్థంబులు జే
యువారును, యిూర్ష్యచేతనున్ను, శామువ్రాయలేద
ను హేతువచేతనున్ను, స్నానంబునకు రాని నాస్తికు
లకున్ను, సభలోనికిరాకఁ జాటుచాటున నీనున గూసి
కొనుచుఁ దుపాణఖండనంబునేయు ప్రితి పక్షులగు న
న్యు పక్షులకు ద్వాదశాష్టక పారాయణంబు సేయు

కాచుకున్నై, మహాసంతోషంబున బ్రహ్మశ్రీ చి॥ మ॥ సి॥ సా॥ గారి సత్కార్యాశ్చర్యంబులు సాక్షాద్గోవిందుని యవతారంబని దలంచి జోహారు లిడువారునై యాత్రికులు ఎచ్చటఁ జూచినఁ దామేయై నేల యీనినట్లుండిరి. అప్పుడు బ్రహ్మశ్రీ య॥ బా॥ గారు సర్వజనుల యెదుట షట్ఛాస్త్ర మహావిద్వాంసులగు మిక్కిలి దుర్గయ్య శాస్త్రిలు గారున్ను, బ్రహ్మశ్రీ యువ్వలూరి గంగాధరశాస్త్రిల గారున్ను, దగ్గిర స్నాతులై నిలచి యుండగా నిట్టి మహాపుణ్యులచే నాచరింపబడిన నీ పుణ్యకాలమును స్థిరపరచిన బ్రహ్మశ్రీ చి॥ మ॥ సి॥ సా॥ గారికి నీ కాకినాడ పురజనుల తరపున ననేకవందనంబు లర్పించుచున్నాడ నని నప్పుడు బ్రహ్మశ్రీ చి॥ మ॥ సి॥ సా॥ గారు ముకుళిత కరకమలములతో గురువుగారితోఁ దులతూగి కంఠీరవంబు బోలిన కంఠమెత్తి శాంతోక్తులతో « అయ్యా ! ఈ గోవిందద్వాదశిం గూర్చి సభ చేయుఁడి మంచిచెడ్డలఁ బరిశీలించి, నా వాద ముం

గీకరించి, తునకు నాకు జయపత్రిక నొసంగి, యనేక
జనసమూహముల పాపసంఘము నశింపఁజేసిన మీవం
టి మహామహు లందరున్ను, « శ్లో॥ ఓం కారావర్త
రమ్యాయ జరమలజలాసామ గంభీరఘోషా । ఋగ్వే
దాథర్వకూలా క్రమపదపులినాన్యాయ శాస్త్రోత్తరం
గా । అంగగ్రావావబద్ధాశత పథకుటిలా బ్రహ్మవి
ద్యార్ణవంతా । విద్వద్వ్యాఘ్రాహ్నవీయం జపయతుదురి
తం సర్వదా సర్వదానః॥ అనురీతిగ నాదురితక్షయము
నకును మహాయశస్సునకుం గారణభూతులైన మీక
నేకవందనంబు లర్పించుచున్నానని మహావినయమున
మూర్ధశైలితో, మాటకుఁ గోటివరాలీయఁ ౹ దగునట్లు
చెప్పి నా నాధ్యయనస్థానములు దీక్షితాని యందరిదగ్గ
రను శైలపురం గైకొని దీపనలంబడసి సిద్ధాంతినివాసు
లును శిష్యులునగు బ్రహ్మశ్రీ కలగ వెంకటరామ సి
ద్ధాంతిగారు మొదలగువారిలో బనకు విచ్చేసిరని తె
లుపంజగిన పుణ్యంబునకు జాల సంతసించుచు, యున్న

హామహుల యపారబుద్ధి సామర్థ్యంబును దేవోత్స
వాగమును, దీర్ఘాయు రారోగ్యాభివృద్ధి బలంబు లొన
గూర్చి, నిత్యప్రమదంబిడి కరుణారసంబునఁ గాపాడ
జగధీశుండగు నీశ్వరుని కనేకవిధంబుల మ్రొక్కుచుఁ
దరువాత యోగ్యతాపత్రిక నొసంగుచు నీగోవింద
ద్వాదశీ దిగ్విజయమును ముగించుచున్నాడను.

యో గ్య తా ప త్రి క.

చ॥ ఏది? సగుణాంబు, నిర్గుణమహానను చింత్యము
రూపమద్భుతం। బేది? పరతత్వమాగమము సృష్టిల
యస్థితి నిత్యకారణం। బేది? నిర వద్యను జ్వాలము
హృన్నమల నిర్మలమాత్మ స్ఫురితం। బది, పరిపూర్ణబ్ర
హ్మము మహాకుప్రసంబో(?)చుత భక్తసంఘమున్॥ ౧

సీ॥ విజ్ఞులెల్లను మెచ్చ విశపతిఁజ చినపూర్ణ సిద్ధాంత
సింహులు చెలఁగిరిపుడు। వాప్రియనివారిలోఁ బ్రిథ
ములైతాము నాస్తికులౌదురంచును చిత్తమందు। భీ
తిల్లి సభకెటోవిచ్చేసి, యీ పుణ్యకాలఁబుకద్దని గార

వమున । నంగీకరించి విద్యానిధుల్వాగడంగఁ దమ
యాస్తికవృబుద్ధి ధరణిమీఁద॥

గీ॥ వెల్లశీఁగఁజేశి దైవజ్ఞ వితతులకు శి।
రోమణియటంచు బిరుదంది యాంధ్రకో।
సారముందార కుందడిండీరకీర్తి।
దనరె వినుతింప నాచంద్రతారకముగ॥ ౨

చ॥ ఘనుఁడా చీమలపాటి వంశజుఁడు సాక్షాచ్ఛం
కరుండై భువిన్ । దనవిద్యావిభవంబు తేటపఱఁగా,
దైవజ్ఞ సింహంబు లె ల్లనుమెచ్చంగ శ్రుతిస్మృతుల్వా
దకి సర్వత్యాముగాఁ జేసెఁబో । దిన సిద్ధాంతులతోడ
ద్వాదశికి నైసర్గ్యకిఁజర్చించి, వారి । సి, నిరాఘాటము
గా విజయంబుఁగొని శాసింగాంచి, పేరోలగం । బున
సంస్థాపనఁ జేశి లోకమునకుం బుణ్యంబుఁ గల్పించి, పా!
వన దైవజ్ఞ మృగేంద్రబట్ట గురులన్ బ్రఖ్యాతనామం
బుఁ బొం। దెను శ్రీకాకపురంబునో ఘనతగన్ సిద్ధాం
తి లోకంబునన్॥ 3

సీ॥ సభకేగి జరిగిన శాస్త్రచర్చలనెల్ల విమలకం ఠ
వ్రులార విన్నవాడ, వచ్చినసభ్యులే పగి। దివాదించి
రో కనుత్రవ్వవాని్ప్రకం గాంచినాడ, దక్కిన దైవజ్ఞత
తులెచ్చటికిని వనిచేయు। శేపికో యరసినాడ। నెవ్వ
రి సామర్థ్యమెట్టిదో నిష్పక్షపాత స్వబుద్ధితో వ్రాసి
నాడ॥

గీ॥ సంగతులు సుప్రసిద్ధమై సత్యగుణుఁట।
నెవ్వరేమనుకొన్న నాకేమి కొఱఁత।
పెద్దపురిఁ గాళ్లకూర్వారి పిల్లవాఁడ।
ఘనత హనుమంతరావనఁ దనరువాఁడ॥

ఇట్లు బుధవిధేయుఁడు

10—3—14.
ప్రస్తుతం కాకినాడ.

కాళ్లకూరి హనుమంతరావు.
విచిత్రభారతము, పెద్దమ్మశతకము. etc. గ్రంథకర్త,
పెద్దాపురం.

